# కలువకోలను

★

వడ్డి వేంకటశివరావు





# అంకితము

ఇండియా పార్లమెంటు సభ్యులు (రాజమండ్రి)
## డాక్టరు కర్నలు (Colonel) డి. యస్. రాజుగారికి

*చతురమతి, నేత, విద్యా విశారదుండు*
*మహిత గుణనిధి, మృదుభాషి, సుహృదుండైన*
*వైద్యరాజున కిది సమర్పణము సేతు*
*కలువకొలనను కృతికన్యకను ముదమున.*





# కృతజ్ఞత

నాయీ గ్రంథముపై తమ అమూల్యాభిప్రాయ మొసగిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవులు, కవిసార్వ భౌమేత్యాది బిరుదాంకితులు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారికిని, నాయీ రచనలవిషయమున తగిన సలహాలనిచ్చి, ప్రోత్సహించి, గ్రంథమునకు ప్రవేశికను వ్రాసియిచ్చిన ఆచార్య, డాక్టరు, దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. (ఆనర్సు) పిహెచ్. డి. (ఉస్మానియా విశ్వవిద్యాల యాంధ్రోపన్యాసకులు) గారికిని, గ్రంథ ముద్రణ విషయ మున మిక్కిలి శ్రద్ధాదరములు వహించిన శ్రీ అజంతా ముద్రణాలయాధికారులకును, ఈ గ్రంథ ముద్రణ విషయ మున ద్రవ్యసహాయ మొనర్చిన శ్రీ కర్నాలు రాజుగారికిని నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

వడ్డి వేంకట శివరావు.



## విషయసూచిక



## ఆస్థానకవి అభిప్రాయము

శ్రీ వడ్డి వేంకటశివరావుగారు అప్పుడప్పుడు వ్రాసి. పత్రికలలో ముద్రింపించిన ఖండకావ్యములలో కొన్ని నేను జూచితిని. ఈయన కవిత్వము మృదుమధురముగా నుండును. గ్రాంథికభాషకు భిన్నముగా ఇప్పటి కొందఱు కవులవలె వ్యావహారికమును గ్రామ్యమును వీరెక్కడను ఉపయోగింపలేదు. ఈ ఖండకావ్యములు స్కూలుపిల్లల పాఠ్యపుస్తకములలో నుపయోగించుకొనుటకు అనుకూలముగా నున్నవని నా అభిప్రాయము.

ఇట్లు
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,
ఆంధ్రాస్థానకవి.

మకాం : హైద్రాబాద్.
14-1-59.





## ప్రవేశిక

శ్రీ వడ్డి వేంకట శివరావు బి. ఏ., బి. యల్., గారు తామప్పుడప్పుడు రచించిన ఖండకావ్యములనెల్ల నొక సంపుటముగా ముద్రింపనెంచి, వానినేర్చి కూర్చి, నాకుఁ జూపఁగాఁ జూచి యానందించితిని. వారు విద్యార్థిదశనుండియు నాంధ్రమునం దధికమైన యాదరము వహించి యందుఁ గవితావ్యవసాయము సాగించుచునే యున్నారు. ఇటీవల నవ్యసాహితీసమితివారు ప్రచురించిన కావ్యసంపుటిలో వారి ఖండకావ్య మొకటి చేర్పఁబడుట వారి కవితాపాటవమునకుఁ దార్కాణము.

ఈ ఖండకావ్య సంపుటమున వివిధములైన కావ్యములున్నవి. అందుఁ గొన్ని పద్యరూపములు; కొన్ని గేయరూపములు. ఏ రూపమునందున్నను అవియెల్ల సరసములైన భావములకును, సరళ సుందరములైన పదములకును నెల్లలై పఠితల కానందము గొల్పుచున్నవి. కలువకన్నె అసూర్యం పశ్య. మహాపతివ్రత. అట్టియామెను జంద్రుఁ డూఱడింపక యరుగుట కవి మృదుహృదయమునకు వేదన కలిగించినది. ఆ వేదన ప్రేరేపఁగా వారు చంద్రుని మెల్లమెల్లగా నుపాలంభించినారు. చంద్రునియందలి మచ్చ కవుల కొక్కొక్కరి కొక్కొక్కవిధముగాఁ జూపట్టినది. శ్రీ శివరావుగారి కది చంద్రుని వ్యవహారములు నచ్చక యెవ్వరో గట్టిగాఁ జెక్కిలినొక్క నేర్పడిన మచ్చగా గోచరించినది. నగరముల కాహారాదుల సమకూర్పఁ జాలునవి గ్రామసీమలే యను



భావము గొల్లబోయఁడను కావ్యమునఁ జక్కఁగా వెల్లడింపఁబడినది. కర్షకులయెడఁ గవిగారికిఁ గల సానుభూతిని 'హాలికా', 'రైతుభిక్ష', 'దగా' అను ఖండకావ్యములు లెస్సగా వ్యక్తము చేయుచున్నవి. "మానవలోకము సర్వము, మనుగడకై తినునదెల్ల, మూలము తలపోసినచో హాలికజనక్రియాఫల" మనుమాట యెంతసత్యమో యంతసరసముగా నున్నది. పాతికేండ్లైన నిండకముందే పరమ పదించిన వేంకటస్వామిని గూర్చి కవిగారు వ్రాసిన పద్యము కరుణ రసమయమై వారికా మిత్రునియెడఁగల ప్రీతిని వేయివిధములఁ జాటు చున్నది. నాటకమను శీర్షికగల ఖండకావ్య మొక సుందరమైన యూహా స్వప్నము. తెలుఁగుతల్లిని గూర్చి వ్రాయఁబడిన పద్యములు మృదు మధురములై కవిగారికిఁగల దేశాభిమానమును గ్రుమ్మరించుచున్నవి. 'ముహూర్తము' కవిగారి సూక్ష్మపరిశీలనమును బ్రకటించుచు, పల్లె టూరి ప్రకృతిపై వారికిఁగల యత్యంతాసక్తిని వ్యక్తమొనరించు చున్నది. "అవని తెలియంగ నరుఁడొక అద్దెకొంప" యను వాక్యము మిక్కిలి యభిప్రాయ గర్భితమై యున్నది. గ్రీష్మఋతువున సూర్యుఁడు పగలంత శ్రమించి పిమ్మటఁ దిమిరకాంతను జేరి నిర్విచారమతితో సుఖించుననుట కొంత క్రొత్తగా నున్నది. ఇది కవిగారి స్వతంత్ర భావనాసామర్థ్య మునకు దృష్టాంతము.

ఈ విధముగా నిందలి ఖండకావ్యములన్నింటఁ జక్కని భావములు చిక్కని శైలిలో మనోహరముగా వ్యక్తము చేయఁబడి యున్నవి, భాష మృదుమధురమై, జాతీయమై, సర్వజనసుబోధమై

యలరారుచున్నది. ఒకటి రెండు గేయములలోఁ దప్ప మిగిలినచోట్ల నది సలక్షణమై శ్రవణానంద సంధాయకముగా నున్నది. పద్యములన్నియు ధారాశుద్ధిశోభితములై చదువుకొనుట కింపుగా నున్నవి. ఇందు వృత్తములకంటె గీతములసంఖ్య హెచ్చు. పదాడంబరముపొంతఁ బోక, యనవసరాలంకారకల్పనము లేక యవి సరళములై యెంతో ముద్దు గొల్పుచున్నవి.

కవిగారి ప్రకృతిపరిశీలనము మెచ్చఁదగియున్నది. అంబేద్కరు, గాంధీజీలనుగూర్చి వారు వ్రాసిన పద్యము లామహనీయులయెడ వారికిఁ గల భక్తిగౌరవములను వెల్లడి చేయుచున్నవి. 'అశోకము', 'రసక్రీడ', 'కోరికలు' మున్నగు ఖండకావ్యములు చిన్నవయ్యును భావసంపద యందుమిన్నలై సహృదయులఁ బలువిధముల మెప్పింపఁజాలియున్నవి. కవిగారు వకీలు వృత్తియందుండియుఁ, గవితావ్యాసంగము వీడకుండు టయు, వీడకుండుటేకాక భావగంభీరములైన పద్యములు వ్రాయఁ జాలుటయు మిక్కిలి ముదావహము. వీరు క్రమక్రమముగా నింకను ఉదాత్తములైన కావ్యములు రచించి యాంధ్రభాషాయోష కలంకారములు కల్పింతురని విశ్వసించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని.
2-2-59.



## కలువకన్నె

అనవరతంబు నిన్నె హృద
యంబున నెంచుచు నీసమాగమం
బునఁ గనఁగల్గు సౌఖ్యముల
మోదముతో స్మరియించి దీర్ఘమౌ
దినమును నెట్టులో గడపి
దివ్యశరీరుడ వీవు వత్తువం
చును దొగకన్నె తా నెదురు
చూచుచు నున్నది చూడు చంద్రుడా !

అందచందముల్ గలయట్టి యబలమిన్న
వికసితస్మితవదనంబు విస్తరింప
వేచుకొనియున్న దానిని వీడుకొనుచు
నచ్చటచ్చటఁ దిరుగ నే న్యాయమయ్య ?

అమలకరముల నీ ముద్దరాలిమోము
నివురుకంటెను సౌభాగ్య మవని గలదె !
వలపువెదజల్లి నీతోడి బ్రదుకుగాఁగఁ
దలఁచుసుందరి విడనాడఁదలఁచుటెట్లు ?





"ఏమితొందఱ ? కార్యార్థ మేగుచుంటి
వత్తు నింకొకపరి మగువా !" యటంచు
నట్లె యేరాత్రి కారాత్రి యరుగుచుండి
నిత్యసంతాప జలధి నీ నిర్మలాత్మ
మంచివైతువు కటకటా యుర్వి నీయఁ
బ్రణయినికి శోకమును రాజ పాడియగునె ?-

ఎన్నడో, ప్రేమఁజూపి హృద
　　యేశ్వరి ! ప్రేయసి ! యంచుఁబిల్చి యీ
యన్నులమిన్న మానసము
　　నంతట బ్రుచ్చిలితంచు పెద్దగా
నిన్నునెఱింగె లోక మిఁక
　　నీ విటు లేపెను బాధ పెట్టఁగా
నెన్నటికేని నీకె చెడు
　　గింక సుఖాబ్ధిని దోఁగఁజేయుమా !

ఈపె శీలమునెడ శంక నెంచితోయి
దీనిచర్యలఁ దెలియంగఁ దిరుగుచుంటి
సుదతియెడ నిత్యశంకితహృదయుఁ డగుట
తగునె నీవంటివాని కో తరళహృదయ !





ఒరులఁ గన్నెత్తిచూడని తరుణి యీమె ;
"చూడు నా మోమునందమ్ము, సొగసు, ఠీవి"
యంచుఁబగలెల్ల తేజు చూపించుచున్న
రవినిసైతము చూడదీ ప్రవిమలాత్మ.

ఆశతో నిన్నుఁగలియంగ నాత్రమంది
యాశభగ్నంబుగాఁగ నిరాశపొందు ;
పొంది గుండియు మూఱటనంది తిరిగి
యాశపొడగట్టఁజూచు నీ యాగమంబు.

వనిత చలచిత్తయం చపవాదెకాని
యెంతనిశ్చలప్రేమమో యెఱుఁగుమోయి
కలువకన్నియ చందముం గాంచి నీవు ;
భువిఁ బతివ్రత లెవ్వ రీ పోలఁతికన్న ?

* * *

లీలకొఱకు నిట్టి వ్యవహారాల నెపుడొ
చేయఁజెక్కిలి గట్టిగాఁ జిదిమినారు,
మచ్చయేర్పడె నయ్యది; మఱచినావొ
మంకుచేష్టలు మానవో యింకనైన.





## అశోకము

రావణాసురులంకలో రాముదేవి
భర్తయెడఁబాటు రాక్షసప్రభునిచర్య
మృదులహృదయంబుఁ గ్రుమ్మఁ బేర్మి నెడి యటు ల
నేకవర్షంబు దుర్భర శోకమందె
నుపవనాంతరభూరిపాదపముక్రిందఁ ;
బిలుతురద్దానిని నశోకవిటప మనుచు
జగతిఁ బ్రఖ్యాతచరిత భూజాత సీత
యామహీజమ్ముకడ శోకమందెఁ గాన
దాని శోకమనియె యనందగునుగాని
యరయ నది యశోకమనంగ నయ్యె నెటుల?





## గొల్లబోయఁడు

పెరుఁగు కావిడి ఎటకోయి! పరుగులేల?
ఆగుమాగుము; స్వాతంత్ర్య మవతరించె!
వెఱ్ఱివాడవా! ఆగవు! వినవిదేమి!
అరరె! విడువదె పట్టు దాస్యానుభవము!!

నేఁడు ఆగస్టు పదునైదు నేఁడె నేఁడు
అవతరించెను స్వాతంత్ర్య మావహించె!
లేదు దాస్యము ఆకలి లేదు లేదు
మనకె మనదేశ మిఁకను పాలనము మనదె.

వేయి స్వరముల నొక్కొక్క వేల్పుపడఁతి
తన్మయతఁ బాడె భరతస్వాతంత్ర్య గీతి-
అవధరింపుము సోదరా! అనుభవింపు
మేల విభ్రమమోయి! ఈలీల నిజము!!





అడుగు సవ్వడి తాళమై అలరె వాని
ఊగి ఆడెడి కావిడి ఉత్సుకతకు ;
ఆతఁ డటె క్రుంగె కావిడి మోఁతవలన
ఆగ డటుక్రుంగిపోవు టభ్యసన మగుట.

జీవితార్థము వానికి చావుకాక
బ్రతుకువెళ్లుట అదియెట్టి బరువుకాని -
ఏదిదాస్యము స్వాతంత్ర్యమేది ? యేమొ !
బరువు కాదగు దాస్యము బరువులేదొ ! !

వలదు రావలదోయి మీ పల్లెవీడి
నీదు సంపద నీకు గానేల బరువు ?
సగము కానేల మోఁత నీ నగరవీధి ?
మేమె నీపల్లె కేతెంతు మింక మీఁద.

పసుల పగలెల్ల గాచు నీ బాలకేది ?
పాలు పెరుఁగుగ మార్చు నీ యాలికేది ?
పసుల పరిపోషణమ్మె నీ బ్రతుకుగాఁగ
పాడిసంపద గూర్చెదు ఫలితమేది ?



పెరుఁగు పెరుఁగంచు వీథుల నరచిపోదు
వెవరు పెరుఁగంగ కోర్కి ? ఓయీ సహోద
రా ! పెరుఁగదోయి నీ పొట్ట, చాపచుట్ట !
కరగిపోవుచు నట్టులే తరగిపోయె.

నీదువచనమె మంత్రమై నిజముగాంచె
పెరిగె నగరమ్ము కల్లగాదెరుగుమోయి
విరిగె పల్లెలు భాగ్యము తరిగిపోయె
ఒకటి పెరుఁగుట తరుగుటింకొకటి కాగ !

పొమ్ము, పదవోయి ! నీ పల్లె కమ్ముకొనగ
పెరుఁగు పెరుఁగంచు నీ పల్లె నరచి చూడు
కోరుపెరుఁగంగ నీపల్లెటూరు; అదియ
తథ్యలక్ష్యము భరత స్వాతంత్ర్యమునకు.

ఇగిరిపోరాదు పొట్ట లింకెవరివేని
పెరుఁగు బువ్వను నీ బొజ్జ పెరుఁగవలెను
కొట్టుకూడును పెరుగుతో జుట్టుకొనిన
నీదుబిడ్డలె యీగడ్డ నేలవలయు.



నగరముల కింత బువ్వ పెట్టఁగఁ దగినది
ప్రేమసౌహార్ద సౌభాగ్య విలసితంబు
సహజ సౌందర్యసముపేత ; స్వర్గసీమ
వరలు సానందమై యిఁక పల్లెసీమ.





## తెలుఁగుఁదల్లి

పౌష కృష్ణపంచమి సోమవారమాది
నమలభక్తిసంయుక్తి సప్తాహదీక్ష
సోదరీసోదరుల మేము సుధలుగురియు
తెలుఁగుఁదల్లికిఁ బూజలు సలిపినాము.

కవులు పండితకవివరుల్ గాయకులును
జిత్రకారులు జ్ఞాత చరిత్రు లఖిల
శాస్త్రపరిశోధనాత్త విజ్ఞానఘనులు
రాజనీతి కళావిశారదులు ప్రాజ్ఞు
లాంధ్రమాతకు నల్వంక నధివసించి
పిన్నపెద్దలఁ గూడి సంప్రీతితోడఁ





దద్యశః కీర్తనము వేవిధాలఁ బాడఁ
బాడినా మేము వారితో స్వరముగలిపి
పాడినా మేము లోకమ్ము ప్రతివచింపఁ
బాడినా మేము గొంతెత్తి పరవశతను;
దానె పాటమై యెదుటఁ బ్రత్యక్షయయ్యె;
దీవనలొసంగె; భవ్య మా తెనుఁగుఁదల్లి.

చిన్ని యన్నలార బులుబుచ్చికము సేసి
తెలుఁగుసంపదఁ దెలుఁగులు తెల్లవోవ
దోచుకొని పోవుచున్నారు దొంగలరుగొ
మంటగల్పుడు తచ్చౌర్యమలినమతుల
ననుచు బల్కిన దపుడు మా యాంధ్రవాణి.

భక్తితైలాన మాగుండె ప్రమిదలందు
వెలుగజేసితి మానాడు తెలుగుజోతి ;
నదియె మా తెన్గుఁదల్లికి హారతియయి
మా మనంబులజేరి కశ్మల మొనర్చు
మలిన విషకీటకాదులు మాడి చావ
నారిపో కింక వెల్గెడు నచలితముగ.





తెలుఁగుజెండాలు మాచేత మెలగినపుడె
తెలుఁగుఁ గేతనంబదె మింట వెలిగినపుడె
తెలుఁగుఁదల్లికి జేజేలు పలికినపుడె
యగుత మీ కభ్యుదయ మంచు నాంధ్రవాణి
రంగుపూవుల మాపైని రాల్చె నెన్నొ.

నిండుజాబిల్లి మా గుండె నిండిపోయె
గండుగోయిల మాలోన గలసిపోయె
మన్మనః కుహార మమృతమయమ యయ్యెఁ
దెనుఁగుఁదియ్యము లొలయు గీతికలు వెలసెఁ
బాడికొనుచు సుఖాబ్ధి సప్తకమునందు
నోలలాడితి మాపూజ నొడలుమఱచి.

(దృష్టిలో, ఆంధ్రాభ్యుదయోత్సవములు, కాకినాడ కళాశాల)





సఖా !

అతివిచిత్రము సృష్టిరహస్య మెఱుగ
నిత్య మిక్కట్లు నీకయి నిల్చియుండ
వెండి బీటలువారిన హృదయమునకు
గురియు నమృతపు గంగను పరమశివుఁడు.

మిత్రునెడ దోషమెంచఁగ మేలుకాదు :
సహజ మిల మానవునకు దోషములుగాన
మిత్రునందలి మంచినే మెచ్చుకొనుము
మిత్రు ద్వేషింతురే తాపమిచ్చు ననుచు ?

ఎవరో ఏమేమొ నినుగూర్చి ఎంచికొందు
రీసు కొలఁదియు నీదారి కెదురువత్తు
రంతమాత్రాన నీవెంచినట్టి పథము
విడువఁబోకుము సెలయేరు విధము గనుము.



కళకు నెలవిది కాంచగాఁ గల్గుదేని,
సత్య శివసుందరముల కర్చనలుసలుప
రాగమయగీతి పాడుచు రమ్ము సఖుఁడ !
నిష్కపటబుద్ధి నిర్భీతి నీ సుఖమ్ము.

క్రిందిచూపును పైకి సారింపుమోయి
ఎగసిపోవోయి మిన్నంటి నెగడుమోయి
తారకల నొక్క తారగా తరలుమోయి
నేర్పు నీవిద్య తేజమ్ము నీయ సఖుఁడ !



ప్రభూ !

ఇతడు ధనపతి, లేమి సృష్టించు ప్రజకు,
బిడ్డ ఒకడైనకల్గని గొడ్డు; వైద్యు
లెందరెందరొ తనమేడ కేగుదెంత్రు
జీర్ణశక్తిని పెంచరు : చిత్రసృష్టి !
కండకరగదు ! ఓ ప్రభూ ! కదలలేడు !

అస్థిపంజర మదె యెండు టాకువోలె
ఇంతగాలికి అంతంతలేసి నడల
కదలిపోయెడు ఊపిరికల నరుండు ;
అదియు నీ సృష్టి—ఓ ప్రభూ !—పృథివికడుపు
కోత; ఏటికి ఈ గారడీతనమ్ము ?





## నిష్క్రమణము

అది పట్టపగలె కన్నదరు చీఁకటి ముంచి
స్వప్నమై తోఁచి వేచనిన దినము
అది మండుటెండ మాహృదుల ఘోషిలఁ బిండి
కనులవెతఁ గురియించిన దినమ్ము
అది కాలపురుషుండు విధిదప్పి మాయెడఁ
గనుల నిప్పులను గ్రక్కిన దినమ్ము
అది మిత్తి వెఱ్ఱిదాహమున మావీటికిఁ
జనుదెంచి తలుపు గ్రుద్దిన దినమ్ము

బంధుఁ డాత్మీయుఁ డతి సాధువైన 'స్వామి'
నెత్తికొని మిత్తి యమవస నిశినిఁ గలిసె;
కంటకమ్మయి కటికి చీఁకటియ మిగిలె
స్మృతిపదాల ముళ్ళుల విరిచిన దినమ్మ.

(10-9-1942 ఉంద్రు వేంకటస్వామి మరణము :
పాతికేండ్లు నిండని వయసు)





## గ్రీష్మఋతువు

రాత్రి గుటిలతనెరపు నరాధములకు
పదిలముగ రక్షణమునిచ్చు పృథివిగాంచి
కఠినశిక్ష విధించగా కర్మసాక్షి
కొరవి చేబట్టి కమ్మరికొలిమినుండి
తూర్పుగా వచ్చుచున్నట్లు తోచుమనకు.

ఎంతొ యుపకృతి నరజాతి కేనుచేయ
నన్ను దలచరు అలచంద్రు సన్నుతింతు
రతని జేరుదురని యినుం డాత్మ నెంతొ
కినుకపూనిన యటులుండె గ్రీష్మఋతువు.

వేయికరముల దినరాజు ఈయనంత
పృథివినింగల జలరాశి బిండిపిండి
రసము దనవెన్కనుంచె; సాహసునిచర్య
'నణువు' సాధించు శాస్త్రజ్ఞు డాపగలడె!



చరమదిక్పతి చేతులు చాచి యినుని
చేరబిల్చెడివేళ నుదారబుద్ధి
ననిలుడుపచర్య చేసె తీవ్రాతపమున
నుడికి యూపిరియాడని ఉర్విప్రజకు.

నేర్పుగా విధి నీతడు నిర్వహించు
కనుల నిప్పులగురియు శిక్షాకరుండు
దీర్ఘదివసము శ్రమియించి, తిమిరకాంత
జేరి సుఖియించు కడు నిర్విచారమతిని.



## నాటకము

వడగాలి సుడికిపోయిన
ఒడలాశించినది శ్రాంతి ఒరగితినంతన్
పడద్రోసికొంచు గాలులు
విడిదిగదిని జేరె నన్ను వీక్షించి చనన్.

"ఆటలలో నాటకమే
ఆట యిపుడు ఆడుమోయి" అని నాచెవిలో
మాటలు వినిపించెను, తా
మీటెను మైకమ్ము, గాలి మీదకు సోకన్.

ఆరాత్రి నాటకములో
నారాటము చెందినాను నాయికలేమిన్
శ్రీరామ ! ఏమిచిత్రము !
చీరను సవరించుకొంచు స్త్రీ దిగివచ్చెన్.





ఏగాలి రూపమీస్త్రీ
రాగాలాపనముచేయు రాగిణి: ఔరా!
ఏగాలిదైన నేనిక
సాగించెద నాటకమ్ము సరిసరియంటిన్.

బంగారు తీగ బోలిన
రంగైన లతాంగి యామె రంభను మించున్
భంగిమ నా నర్తకి బల్
చెంగున రంగమ్ము నెక్కె చిటిపొటి నడకన్.

ఆ కొంటెచూపులోపల
దాకొన్నది లోతులోతు తత్త్వమదేమో
నాకమున నెత్తెనన్నహో!
శ్రీకంఠస్వరము మహిమ చెప్పితి నెరుగన్.

కనరాడు కణ్వు డామెయు
కనరారిట చెలులుకూడ కాంతయు నేనే,
మునికన్య ప్రణయ స్నేహము
ఘనశాపము భగ్నపరుపగల్గునె చూడన్.





ఆదరణ మెట్టిదోహో!
మాధుర్యము త్రావి నేను మరచితి తనువున్
లేదిచట కలశ, మధరమె
అధారము మధువుఁ గ్రోల ఆ నగుమోమున్.

భరతుండు కల్గునని సం
బరమున నుప్పొంగలేదు; పరువుదలిర్పన్
స్థిరమగు భద్రసమాజము
పరమాత్ముని కరుణ గల్గ ప్రార్థనచేతున్.

ఆమె శకుంతల వేషము
మామాయని మగువ పిల్చె మతిచలియింపన్
ఆమెకు నే దుష్యంతుడ
నా మాటను మరచెనేమొ అబ్బురమాయెన్.

మామాలు రెండు గలిసిన
ఏమా అర్థమ్మటంచు ఏకాంతముగా
సోమయ్య దలచి, చదివితి
కాముని లీలావిశేషగాథల నాశన్.





సఖి! నా శకుంతలా! ఓ
సఖి!! యని పలుమారు పిల్చి సగమైతి కటా!
సఖి లేదిట మేనల్లుడు
శకటము ధూమమ్ము విడిచి చకచక వచ్చెన్.

[గోదావరి రైలు స్టేషను; ధూమశకటము వచ్చుటకు ముందు ఐదు క్షణాల కునుకులో అనుభవమైన నాటకము.]



## కోరికలు

కక్షిదారులచల్వ కలకాల మమరంగ
రంగనికోరు పరార్థవాది
ఇరుపక్షములవారు నేడుకొండలవాని
ప్రార్థింత్రు తమతమ వైపుజేరి
జయముచేకూర్చగా సత్యమో కపటమో
వ్యాజ్యకారణ మెట్టిదైనగాని
న్యాయవాదికి భరణము నర్పణముచేయు
నోడిన గెల్చిన నొకటెవిధము
న్యాయమూర్తులు ధర్మనిర్ణయముచేయ
న్యాయవాదుల సహకార మనవరతము
కోరు; న్యాయము దముచేయగోరు న్యాయ
వాది తలవంచి, శాస్త్రప్రబోధ మెంచి.

కోరికలగుంపు మసలె కచేరియందు
కాఱునలుపైన దుస్తుల కానవగును,
న్యాయమూర్తి విశుద్ధముఖారవిందు
డవని ధర్మకిరీటము నలరదాల్చె.



## రసక్రీడ

ఆకాశపు టారామము
నందలి సుందరపుష్పము :
పూవులలోనెల్ల రాజు
పూబోడుల కయ్యే మోజు
అదేరాజు రాత్రికెంతో
అదేమోజు నాజూకది
అతివిశాల మతివిశుద్ధ
మదిసుధా ప్రపూర్ణ సుమము !
మల్లెకాదు, స్నిగ్ధకీర్తి,
చల్లని కితకితల ప్రోవు ! !



అమెరికా ప్రసిద్ధనారి
ఆశదెల్ప నదేక్షణము
రషియా సుందరి కోరిక
ప్రకటించిన అర్ధక్షణము
పయనమయ్యె నింగిజేర
రయమున శూరంమన్యుడు :
సుమముదెచ్చి శ్రమముజెప్పి
సుదతి మనము బట్టుకొనగ ::

భారమనక మోసినాడొ
నారీమణి ముద్దుకోర్కె ::



## అద్దెకొంప

ఐదుగంటలవేళ సాయంతనమున
నేను కూర్చుండి తోట ప్రసూనములను
కనుల విందుగ నాశతో గాంచుచుందు ;
రెండు చూపులు డీకొను, మొండిగోడ
దాటి తళుక్కున తరుణి ప్రత్యక్షమయిన.

వాలుచూపులు చూడ దింపారఁ జూచు
బరువుగా నిండువెన్నెల విరిసిపోవు :
మచ్చ దుడిచిన చంద్ర బింబాల కూర్పు ! !
కన్ను మెదిపిన నవ్వు పూల్గారు కనుల.

దినదినమ్మున కొకచీర తీర్చికట్టు
ఒక దినమ్మున కొక సుమం బువిద యగును :
పొగడ, మల్లియ, మందారమగు గులాబి,
పోల్చికొందును నాతోటపూల నామె.





ముద్దుగొల్పెడు బంగారు ముగుదమోము
కళలు పదియారునిండి వికాసమెసగ
నల తిలోత్తమ నూర్వశి నవలనుంచి
దిద్దుముగ్గులు నడక భూదేవియింట.

కులము, స్థితియేమి? వివరాలు తెలియరావు,
పూవు చేబట్టి పుట్టు పూర్వోత్తరములు
తడవికనుగొను శాస్త్ర శోధకుడ గాను;
సుందరమ్మగు వస్తు వానందకరము.

సుదతితియ్యని నిండైన చూపుత్రాగి
ఒక్కక్షణమైన స్వర్గాన నుండదలతు.
హ్లాదకరమగు వస్తువు నాదివసుధ
నామెగాననిదినము నాకగు నెడారి.

ఊరువిడువంగ వలసె నుద్యోగినగుట;
ఆ మహాభాగ్య మనుభవ మగునె యిపుడు
రాతిగోడల యిల్లు! ఆరామమేది?
అవనితెలియంగ నరుడొక అద్దెకొంప!



# తల్లులకు తల్లి

దివ్య గోదావరీ నదీతీర భూమి
నలరు లంకలఁ బెరిగిన ఉలవతీగె
తుష్టిగా మేయు గోవు సంతోషకాంతి
కాంతు మోమెత్తినంత దిగంతరముల.

విమల గోదావరీ నదీవీచి నెదను
ముకురమని యెంచి తన మోము మురిసిమురిసి
చూచుకొను గోవుఁ గాంచ నసూయ గల్గ :
దాని నొసలు దెల్పును వసంతాగమంబు.

మీరు గోదావరీ నదీతీర మందు
ఎత్తుగట్టున నిలచి వీక్షింతురేని
భావముల నెత్తుచేయు నాగోవు రూపు
కాంతు రది మాతృభావ నిష్కలుషమూర్తి.

దేవి గోదావరీ నది గోవువంటి
దామె యొసగెడి పాలు సస్యాలు త్రాగి
భూమిపెరుగంగ ప్రజలకు బువ్వపెట్టు
తల్లులకు తల్లి పుణ్యగోదావరి భువి!



దివ్యగోదావరీ నదీతీర మందు
తుష్టిగా మేయు నా గోవు తోక కుచ్చు
కదలి నటియించు నటరాజు గంగ జూచి
వేడ్కతో మెప్పుకై తాండవించెనాగ.

నాదు పిత కోరు పెరుగును, నాదుబిడ్డ
వలెనె నా తల్లియును తల్లడిలును గోవు
పాలొసంగని పూటను: దురవస్థ నాకు;
తల్లులకు తల్లి గోమాత ధరణి కరుణ.

కోటికంఠాల మార్మ్రోగు కోట్లకొలది
నరులజీవన గీతాల పరమభావ
మెఱుగ గోదావరి హృది(మోయించి పాడ
ఆలకింతుము కోటిలింగాలదరిని.

నిండిపొరలు పాలను కల్గు వెండికంచ
ముగ ప్రజాళికి గన్పడు మరియు చంద్ర
బింబ మది యావుపాలను బితుకబోవ
పొదుగు నిండెనో యని భ్రాంతి పొడము నాకు.



## గాంధీదేశము

ఎరుగరు భారతమ్మనగ
నెవ్వరో కాని విదేశపౌరులన్
కరము ప్రసిద్ధిగాంచె నిది
'గాంధిజి దేశము' గా జగమ్మునన్
పరుల దురాగతమ్ము లెడ
బాపు నరోత్తము డౌను బాపుజీ
పరువు కుదిర్చె దేశముల
భారత భూమికి నాత్మశక్తియై.

ఇతడో 'పరార్థవాది' యె
సతతము న్యాయమును సత్యసాధనకోరెన్
మితిలేని దీక్ష బూనెను
ఇతరుల పాలనము ద్రోసి హితమొనగూర్చన్.

మతరక్షణమ్ము కోరెను
పతితుల నస్పృశ్యజనుల పరమార్థమునన్
పితవోలె గాచె గాంధీ
బ్రతికిన బ్రతుకెల్ల నిండె భారతభూమిన్.



శాంతి యహింసలు సహజీవనముదేశ
దేశాలవారికి తెలియ జెప్పి
గాంధీ మహాత్ముడు కలియుగమ్మున ధర్మ
జ్యోతియై ప్రగతిని జూపె జగతి ;
సర్వమత సహన మాదర్శగుణముగా
బోధించె ప్రజల కపూర్వశక్తి !
శ్వేతజాతుల యుద్ధనీతిని దెగనాడి
సాగనంపెను శాంతి సాగరుండు ;
రాజకీయ కలావిశారదులు వల్ల
భాయి, జవహరు లాది ప్రపంచకీర్తి
ధాము లిట గల్గ గాంధి పథానువర్త
నమ్మె ; నిర్మించినారు రాజ్యమ్ము మనకు.

మాల మాదిగ పాకి కులాలవారి
బోలు మానవు లితర దేశాలఁగూడ
కలరు భారత మొక్కటే కాదటంచు
తృప్తిపడలేని వాఁడు జాతిపిత ఒకడె
గాంధి లేడిపు డీఁకపుట్టఁగలఁడొ లేఁడొ.



## అంబేద్కారు భీమరావు

ధరణిగలయట్టి రాజ్యవిధానములను
శ్లాఘనీయము భరతరాజ్యాంగశాస్త్ర
మది రచించిన ముఖ్యు డనంతకీర్తి
వివిధ విద్యాప్రపూర్ణు డంబేద్కారుండు.

గట్టి శవపేటికను పండఁబెట్టి శవము
కట్టకడపటి మేకునుగొట్టె భీము
డహో! విచిత్రము! అది మూఁత నవలఁద్రోసి
తలను పైకెత్తె నస్పృశ్యతాపిశాచి!!

పురుషుని ఛాయగా భరత
భూమిని స్త్రీ కలకాలమున్ కటా!
బరువుగ వెళ్ళఁబుచ్చు టది
భావ్యము కాదని భీమరావు సం



స్కరణము జేసె; హిందువుని
    సంతతి నాఁడుదికూడ భాగమున్
బురుషునివోలె నాస్తి నిక
    బొందగఁ సంస్తవనీయుఁ డెంతయున్.

పుడమితేజస్వి అంబేద్కరుడు వచస్వి ;
దీనజాతుల యిలువేల్పు ధీవిశాలి,
సదయ గంభీరసాగర హృదయుఁ డమిత
స్నేహశీలుడు నిర్వక్రశీలులయెడ.

మనువు ధర్మము సంస్కరించిన మనీషి
తనువు చాలించె; వణఁకె భూతలము వెలుగు
చరమదశ ధాత్రివినిచె విషాదగీతి
దివ్య పురుషులు క్రీస్తు గాంధీలవిధమె.





## ముహూర్తము

జనము ! జనము ! ఎంత జనము ! !
జనయిత్రీ ! దేశమాత !

చూడుమమ్మ ఈచోద్యము
చూడుము జనసందోహము !

ధరణికి ఉద్ధరణకోరి
తాము ధాన్య సృష్టిచేయ
ఊ(డ్పులంచు స్త్రీజనమ్ము
ఊరిలోని కూలి జనము
నిండినారు పొలము పొంత
పండుగయ్యె పొలమెల్లను

జనము ! జనము ! ఎంతజనము ! !
జనయిత్రీ ! దేశమాత !

ఏమమ్మా మోమెత్తవు ?
ఎందుకమ్మ కనువిప్పవు ?



ధాత్రిని "ఎముకలగూడులు"
దారిద్ర్యము నిండి నిండి
ధరకు సిరినొసంగికూడ
ధరణికి బరువై పోయెను !
కలువ కిరీటముధరించి
పరువులెత్తసాగె జనము !

జనము ! జనము ! ఎంతజనము ! !
జనయిత్రీ ! దేశమాత !
కనలేవో ఈపరుగులు ?
కనజాలవొ ఈప్రజాళి ?

ఇంతమంది కడుపునింద
ఏమున్నది – గంజికాక ?
పప్పు, నేయి, ఊరుఁగాయ
పరమాన్నము గుడిచివచ్చి,
దినముకూలి ఐదణాలు
తేల్చి, త్రేన్చె పెద్దరైతు !

జనము ! జనము ! ఎంతజనము ! !
జనయిత్రీ ! దేశమాత !



కనలేవో ఈన్యాయము ?
కనలేవో ఈ పోకడ ?

శ్రమలోనే కూలీలకు
అమాయికపు టానందము !
కేరింతల కలకలమ్ము
కృషిఫలమ్ము తమకైనటు !
లెంత ఉత్సుకత ! ఓహో !
సంతోషపు గీతాంజలి ! !

జనము ! జనము ! ఎంతజనము ! !
జనయిత్రీ ! దేశమాత !
వినుమమ్మా జాలిపాట :
వినుమమ్మా ఉఁడుపుపాట.

నేల ఈనినది జనాళి !
నేలను కనగల్గె జనము !
మిటమిట తళతళ సూర్యుఁడు
చిటిపొటి చినుకులఅందము
తేనెసోన ! పూలవాన !
దేవతలే కురియించిరొ ! !





జనము ! జనము ! ఎంతజనము ! !
జనయిత్రీ ! దేశమాత !
కనగలవో ప్రకృతిశోభ !
కనజాలవా ఈ జనాళి ?

చేలనీటి తరంగాలు
చేతులూపి సమ్మతింప
మ్రొక్కి—పూజఁ బనికత్తెలు
మునుముహూర్తమునఁ జేసిరి;
తాటియాకు గొడుగుక్రింద
త్రాగెచుట్ట పొగరురైతు ! !

జనము ! జనము ! ఎంతజనము ! !
జనయిత్రీ ! దేశమాత !
కనలేవో కన్నతల్లి
కడుపుచుమ్మ లౌనేమో !





# దగా

అన్న ! ఎన్నాళ్ళిన్ని భూములు
దున్ని కన్నా వీ దరిద్రత !
దున్ని కన్నా వీ దరిద్రత ! !
ఇన్ని యిడుమలు "లేమి" కొరకా ?
దున్నగలవా ధరిత్రి నెల్లను
మిన్నుఁగూడ, తమస్సు జీల్చుచు !
అన్న ! మెతుకులు నీకు దక్కవు ;
మిన్నుకను నీ ప్రేవు లరపులు.
పన్న డెన్నడు నాఁగలిని, తా
దున్న నెరుగడు భూమి ; నైనను
అందుకొను పంటలను భూకా
మందు పొందును సుఖము లెల్లను.
ఏ దగాతన మోయి నిండెను
నీదు నాగటి చాలులందున ?
నీ శ్రమన్ ఫలియించు పంటలు
నీకు దక్కని దగాతన మిది.
సీత నీ కెక్కడ లభించదొ
స్త్రీలభించదొ కనికరించగ ;





నీదు నాగటి చాలులో నీ
కేదియును కనబడ దదేమొకొ !
"కూలి కుమిలెడి కూలికూలీ
కూలి ఓ వ్యవసాయకూలీ !"—
కోకిలలు నీ బ్రతుకు కథవిని
శోకమున కన్నీరు కార్చెను.
"కూలి కుమిలెడి కూలికూలీ
కూలి ఓ వ్యవసాయ కూలీ !"—
కాకి సంఘము నీదు కథవిని
శోకమున ఎలుగెత్తి ఏడ్చెను.
కాని ఏమి విచిత్ర జగమిది !
మానవులు నిన్జూచి యేడ్వరు !!
మానవులు సిరిగన్న స్వాములు
మానభంగము ఈ ధరిత్రికి !!!
శాసనమ్ములు లేవు నీకయి
శాశ్వతముగా "లేమి" నీకయి !
కాసుగల భూస్వామి సభ్యులు
నీ సుఖమ్మున కేమిసేతురు ?





## రైతుభిక్ష

అనామకము లోకదృష్టి
సమాయికపు రైతుబ్రతుకు !
ఘుమఘుమ వాసనలులేవు
ఢమఢమ డంబాలులేవు
తనకు పంచభూతాలకు
అనవరతము వ్యవహారము.

★

భూమిని పాదాలతోడ
పూనికతో నరగరాచి
పరమాద్భుత శక్తినిచ్చి
పంటలసృష్టించురైతు !
తనవిలువనె తానెరుగని
తత్త్వములో నలుగువాడు
ఆకలిరుచి నెఱుఁగువాడు
లోకము పోషించువాడు !

★ ★





మానవలోకము సర్వము
మనుగడకై తినునదెల్ల
మూలము తలపోసినచో
హాలిక జనక్రియాఫలము.
గ్రామీణుల శ్రమఫలితము
రైతుపాద కృషిజనితము !





హోలికా !

రేపునీది; నిండుగా ధ
రింపుమా హలాయుధము !
ధరణినీది ; అర్థనీతి
నెరుగుమోయి మర్మము !!

కనులుతెరచి, నోరుతెరచి
పనికిమాలినట్టి నరులు
నీక్రియా ఫలమ్ముకొరకు
నిల్చిచూడ నెంతురోయి.

మతులులేని నరులునిన్ను
వెతలపాలు చేయుచుంద్రు
స్వార్థపరులు గుత్తెరుంగ
జాలకుంద్రు నీదుసేవ.





దున్నమోయి భూమి ; నెగర
తన్నమోయి దారిద్ర్యము ;
మట్టినలిపి, మాయనలిపి
మహాసృష్టి గావించుము.

పొలముపంట నింపుమా !
కలిమి ప్రజకు పంచుమా !
కలదు స్వర్గమంచు – అహో !
ఇలాతలము రూపించుము.

